శ్రీ

పరమేశ్వరార్పణమస్తు.








మచిలీబందరు ఛత్రపుర వరమున నెలకొనియుండు

శ్రీ భ్రమరాంబా మల్లిఖార్జునుల

# గీతానుతికదంబము.

ఇది శ్రీ ఉమామహేశ్వర ప్రసాదుండును కాశ్య
పసగోత్ర కులోద్భవుండును ఆపస్తంభ సూత్రుం
డు చిట్టా లక్ష్మీనారాయణ పుత్రుండునగు
వేంకటరామయ్య విరచితము.

మచిలీపట్టణములోనున్న ,,తెలుగు లా జర్నల్" ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

1915 సం॥

ఓం!

శ్రీ శారదాయనమః

శ్రీ గణేశాయనమః

# కీర్తనలు.

రాగము - కాంభోజి - తాళము - అట.

ఇభరాజవదనా - పార్వతీ పరమేశనందనా । పరమేశ
నందనా - భక్తావి చందనా ॥ పల్లవి ॥

ఫాలాక్షుసుతుడని - నిన్ను నేను పూజజేసీతి । నిను
పూజజేసీతి - నినుకొనియాడితి॥ ఇభ ॥

శరణాన్న సుజనుల - మరువక రక్షించువాడవు । రక్షిం
చువాడవు - కాపాడువాడవు॥ ఇభ ॥

ధరఛత్రిపురవరమున వేంకటరాముని । ఏలేటివాడవు -
పాలించువాడవు॥ ఇభ ॥

శ్రీ శంకరాయైనమః

రాగము - కాంభోజి - తాళము - అట.

పాలించరా పార్వతీశ । పాలించు శ్రీ ఛత్రిపురము
మల్లేశ॥ పాలి ॥ పల్లవి ॥

భక్తవత్సలుడవని ప్రబలిన దేవ । భటుని సన్నేలుటకు పరిశీలన సేయవు॥ పాలి ॥

కఠినాత్ముడనని కోపముంచక । కారుణ్య మతినన్ను కాపాడవదేర॥ పాలి ॥

పాలముంచిననీవే నీళ్లముంచిననీవే । పలచన సేయక పాలించు దేవ॥ పాలి ॥

పలుమారు నినునేను బ్రస్తుతిజేసేద । ప్రాపైదాపై యుండు పాపవినాశన॥ పాలి ॥

చిట్టా వేంకటరామదాసా ప్రాణేశ । జలజనయన నా జన్మ మీడేర్చుమీ॥ పాలి॥

## —♦ మంగళహారతి. ♦—

రాగము - నాదరామక్రియం - తాళము - త్రిశ్రగతి.

బాలచంద్ర భూషణాయ । బాలసూర్యభాసురాయ ।
కాలగర్వ భంజనాయ - కలితమంగళం ॥

పార్వతీ మనోహరాయ । పాపపుంజ నాశనాయ ।
పద్మనాభసాయకాయ - భవ్య మంగళం ॥

సాధుహృదయ రంజకాయ । సారసాభనేత్రాయ ।
సామగాన లోలాయ - సత్య మంగళం ॥

నీలకంఠ శోభితాయ । నిర్వికార రూపాయ । నిగ
మాంత వేద్యాయ - నిత్య మంగళం ॥

సర్వలోక పూజితాయ । సర్వలోక పాలనాయ । సచ్చి
దానందాయ - సత్యమంగళం ॥

రజతగిరి నివేశాయ । విజితశత్రు సంచయాయ ।
గజచర్మ ధారణాయ - కలిత మంగళం ॥

చారుగిరి నివేశాయ । చారుమందహాసాయ । హీర
హార శోభితాయ - నిత్య మంగళం॥

త్రిపుర నివాసాయ । చిత్రరూపశోభితాయ । చిత్ర
జుశిక్షితాయ - దివ్యమంగళం ॥

సంకటాప నోదనాయ । శంకరాభిధానాయ । వేంకట
రామ పాలనాయ - విజయ మంగళం ॥

శ్రీ అంబాయైనమః

—♦ మేలుకొలుపు. ♦—

రాగము - భూపాళం॥ తాళము - ఆట.

అంబా మేలుకో । బాలమేలుకో॥ పల్లవి ॥

మేలుకో శ్రీ త్రిపురమున విలసిల్లు । మల్లేశ్వరుదేవి
మేలుకో॥ అంబా ॥ పల్లవి ॥

మేలుకోమాగధ గాయకులు వచ్చిరి । మహిషాసురి
మర్దని మేలుకో మహిమీాదనీవర నామస్మరణకు
మంచి । మాన్యులొచ్చున్నారు మేలుకో॥ అంబా ॥
మల్లెలు మొల్లలు మంచి సంపెంగలు । మునులు దె
చ్చున్నారు మేలుకో । వాలాయముగ వారి వరగుణా
నుభవము । వరసతో పొందుటకు మేలుకో॥ అంబా ॥
మేలుకో శ్రీయాదిశక్తివి వైయున్న । మల్లిఖార్జుని
సతి మేలుకో । కంజముమించు మీాపాదసేవకు వేం ।
కట రాముడొచ్చెను మేలుకో॥ అంబా॥

—◆ కీర్తన. ◆—

రాగము - సౌరాష్ట్రి - తాళము - ఏక.

నినునమ్మకున్నవాడను ఓఓ బాల ఓఓ జనని । నిను
నమ్ముకున్నవాడను॥ పల్లవి ॥
నినునమ్ముకున్నవాడ । ననుపరుల జేరనియక । మన్న
నజేసికావుమీా॥ ఓఓ బాల ॥
మానాభిమానములకు । మానుగనే లోనైతి ।
దీనతనొందనేరనే॥ ఓఓ బాల ॥
సంసార సాగరమున । హింసల బడితిచాల । వేసట
దీర్చి బ్రోవుమీా॥ ఓఓ బాల ॥

రంగుగ దాసుడైన । వేంకటరామునేలి । పొంకము
తో ప్రేమయుంచుమీ॥ ఓఓ బాల ॥

## లాలిపాటలు — నక్షత్రమాలిక.

రాగము - ఆనందభైరవి - తాళము - ఖండగతి.

1. లాలిశ్రీ యంబలాలి । లలితాంబలాలిశ్రీ బాలలాలి ।
లాలిశ్రీ చండిలాలి । లలినొప్పు శాంకరీ గౌరిలాలి॥
పల్లవి ॥

2. శ్రీవెలయును హిమగిరిని । గరిమతోక మలమధ్య
మందు । బాలగా జన్మించిన । గిరిరాజు భాగ్యమెట్టి
దో చూడరే ॥ లాలి ॥

3. పుత్రినికోరి మదిని । ఆ రాజు ఏకదృష్టినివేడగా । అ
దేవి అపుడుమెచ్చి । ధీతితోపార్వతిగ వెలసెనటరే ॥

4. అప్పుడారాజుజూచి । ఒప్పుగా సకల సంపదలుదెచ్చి ।
దేవాంగనలకునొసగి । వారిని సకలవిధముల పొగిడెను॥

5. ప్రీతితో వారందరు । బిడ్డను బంగారు తొట్టెలోను ।
వాలాయముగ పొంగుచు । ఊచిరి మాయమ్మ య
నుచు పొంగ॥

6. ఓబాలయీ మాకోరా । మా బాధలన్నియు నేటితోను ।
చాలుగా బాపుకొరకు । జగమున నవతరించిన జననివి॥

7. ఆదిశక్తి రూపివే । ఓతల్లి చిన్మయాకారి గదవే ।
మాపాలి దేవిగదవే । ఓబాల చిచ్చిస్వరూపిగదవే ॥

8. ఈ లోకములయందున । యవరికి తెలియని స్థితివిగదవే।
ఎవరు నీమహత్యము । తెలునుకోలేనట్టి పదవిగదవే॥

9. ఈ విధమువారందరు । నాబాల స్థితిఅంత వేడగాను ।
అదేవి అపుడుమెచ్చి । ప్రీతితోవారికి నభయమిచ్చె॥

10. సొంపుగా వారివలన । యింపుగా కాచిరక్షించుకొరకు।
ఆ సరోవరమునందు । ఆసతో కూర్చుండి తపముజేసే ॥

11. దక్షిణామూర్తి పేర । దీక్షతో పశుపతి తపముజేసే ।
ఆ తపము హెచ్చి హెచ్చి । అనూధీలోకములు నిం
డియుండె ॥

12. దానికితాళలేక । దేవతలు హృదయమున భీతిజెంది ।
లోకకర్తనగబరగు । వాగ్దేవిప్రియునకప్పుడు మొక్కిరి॥

13. ఓధాత కావవయ్యా । యీఘాటికిప్పుడే మేమందుము?
మాబాధ జూచినీవు । యీబాధ తప్పించుమనివేడెను॥

14. సురజ్యేష్టు డంతజూచి । దేవతలభయమును కావలేక ।
వారికిసమ్మతిగను । యీలాగునెమ్మదిగఁదెలియబలికె॥

15. దేవతులారమనము । యీలాటిఘోరతపమునునెన్నడు
చూచివిన్నదియులేదు । చూడగా చోద్యమయ్యెను
బాగుగ॥

16. మనమెల్ల నొకసరణిగ । మానుగపార్వతి కడకుజేరి ।
వేడుకలు ఉప్పొంగగ । వాటముగ నాదేవిమెప్పింతము॥

17. అనుచు బలుకుచు వారలు । మానుగ యక్ష కిన్నరుల
తోను । ఆదేవి కడకుజేరి । ప్రీతితో నుతులుజేసిరి
యంతట॥

18. దేవాది దేవిసుమ్మి । ఓ విజయనిర్మలాకారి సుమ్మి ।
బాలరూపముపొందిన । శ్రీలలి తాంబికా దేవిగదవే ॥

19. వేదాంతవేదినుమ్మి । ఓదేవి ఆవిజయలక్ష్మిసుమ్మి ।
దైత్యహంతిశ్రీణిగ బరగు । భూతేశు రాణివై యొప్పె
నటవే॥

20. మహాలక్ష్మి యనగవచ్చు । ఓఅంబమాలిని యనగ
వచ్చు । కులసుందరిపేరను । వరుసగా జగములు
నిండియుంటివి ॥

21. అమ్మమ్మనీవెకావె । యింపుతో సకలరాక్షసుల
దునిమి । వాసిమీరిన ప్రేమతో । జేసితివి సకల
లోకములుబాగ ॥

22. ఇటులనుచు బహువిధముల । వాటముగ నాదేవి
మెప్పించిరి । వాసిగా నాదేవి । ధ్యానతో బహు
వందనములు జేశే ॥

23. ఓదేవి యిపుడునీవు । ప్రీతితో మామనవి మనము
నుంచి । సంతోష ముప్పొంగను । భూతేశురాణివై
వెలయవమ్మ

24. ఈరీతివారందరు । వారిని నిద్దరిని నొకటిజేసి ।
ఆతపముబాధతీరి । ఆరూఢి సకల సుఖములనొందిరి ॥

25. ఈసచ్చరిత్రమును । ధ్యానతో శ్రవణంబుజేసితేను ।
ఆశమీరినప్రేమతో । వాసిగా పఠనంబు జేసితేను ॥

26. భద్రిపురమున వెలశియు । పాలించు మల్లేశ్వరుని దేవి ।
వేంకటరామునేలి । వారికి యిష్టసంపద లొసగును ॥

27. ఇహపరములు రెండును । మహిమతో కరతలామ
లకముగను । రంగుమీరగ నొందగ । పొంకముతో
ముక్తి కన్యనుకనుదురు ॥ లాలి ॥

## —♦ మంగళహారతి. ♦—

రాగము - సురట - తాళము - అట.

దక్షుని గృహమున । తనయవైజనియించి । దాక్షా యణిపేర తగనుబెంపొంది । దక్షాధ్వరము వి । ధ్వంసముజేశియా । దక్షునిశాపము తప్పించుజననీ ॥ మంగళం ॥ మంగళం । పార్వతినీకు । అంబానీకు । మంగళం । మంగళం । పల్లవి ॥

పర్వతమునబుట్టి పశుపతివరియించి । పరగబ్రిహ్మాదుల పాలనజేశి । సర్వలోకములు సరణిగనేలిన । జగదంబ పాపనాశని శర్వాణీ॥ మంగళం ॥ మంగళం ॥

సకలభువనములు । సర్వావస్థలనొంది ప్రికటముగా నిన్ను బ్రిస్తుతిజేయ । అకలంక దయజెలువార వారల బోిచి । వికటదైత్యులదునిమి । వెలసినగౌరీ॥ మంగళం । మంగళం । అంబానీకు మంగళం । మంగళం ॥

కరుణతో భక్తులకడ తేర్చిఇలలోన । భరితప్రిఖ్యాతివి భాసిల్లగాను । కరమొప్ప చిట్టా వేంకటరామదాసుని । యిరవుగ బోిచిన యిష్టకామేశ్వరీ ॥ మంగళం । మంగళం । అంబానీకుమంగళం । మంగళం॥

## — ◆ మంగళహారతి. ◆ —

రాగము - కాపి - తాళము - త్రిశ్రగతి.

1. హారతి జయహారతి మంగళ । హారతివ్వరే ।
ధీరతతో వెలుగుబాలా । త్రిపురసుందరికి ॥ పల్లవి ॥

2. నాదబిందుకళలయందు । నాట్యమాడుచు ।
ధీరతతోడ వెలుగుచుండె । దివ్యసుందరికి ॥ హా ॥

3. రంగుగ శ్రీ చక్రమున । వాలాయముగ ।
పాంకముతో సంపదలొసగె । పుష్పబోణికి ॥ హా ॥

4. కోటిసూర్య ప్రభలవెలిగె । కోమలాంగికి ।
సీటుమీర భక్తులగాచె । నీలవేణికి ॥ హా ॥

5. శిష్టజనుల పాలన జేసే । సృష్టికర్తకును ।
ఇష్టపదవి నొసగిబ్రోచె । ఇందువదనకు ॥ హా ॥

6. ఛత్రిపురము నందు వెలసిన । సర్వమంగళకు ।
చేరి దాసులబ్రోచెటి । శరదిందువదనకు ॥ హా ॥

7. చిట్టా వేంకటరామయ్యనేలు । చంద్రవదనకు ।
బోటులార గుములుగూడి । ప్రీతి హెచ్చగను ॥ హా ॥

గద్య॥ ఇది శ్రీ ఉమామహేశ్వర ప్రసాదుండును కాశ్యపస
గోత్రకులోద్భవుండును ఆపస్తంభ సూత్రుండునగు
చిట్టా వేంకటరామయ్య విరచితము. సమాప్తము.

# శారదా స్వబోధిని గ్రంథావళి.

1. 26 అధ్యాయములు విచిత్రములగు సాధకములు ఉదాహరణములు కలిగియుండు తెలుగు ప్త్రిమరి అంక గణితము.

తపాల ఖర్చులుగాక వెల రు. 0—4—0.

2. 12 అధ్యాయములు విచిత్రములగు సాధకములు ఉదాహరణములు పద్యములు వర్గమూలములు మొదలగునవి కలిగియుండు తెలుగు సర్వేమెన్స్యులు.

తపాల ఖర్చులుగాక రు. వెల 0—8—0.

వలయువారు:-

చిట్టా వేంకటరామయ్యగారు,

రిటైర్డు సబ్ యింజనీరు.

గొడుగుపేట,

మచిలీపట్టణము.

